శ్రీ

# భుజగభూపాలశతకము.

## క్రొత్తపల్లి సుందరరామకవి కృతము.

క. పురుషోత్తము మకుటంబును
శిరమున నిడి యడిద మొకఁడు చేకొని నడువన్
వరవిజయలక్ష్మి చేకుఱు
టరుదే రామునకు నిశ్చయంబుగ ధరణిన్.

శ్రీ రా జా
మంత్రిప్రెగడ భుజంగరావు బహద్దరు జమీందారువారి
షష్ఠపుత్రికా వివాహమహోత్సవ సందర్భమున
శ్రీవారికిఁ గృతియీయఁబడెను.

ఏలూరు.

1929.



కొత్తపల్లి సుందరరామయ్య,
కృతికర్త.



శ్రీ రాజా మంత్రిప్రెగడ భుజంగరా[illegible]
బహద్దరు జమీందారు,
కృతిభర్త.

# ఉపోద్ఘాతము.

"భుజగభూపాలచంద్ర" అను శతకము సమగ్రముగ వింటిని. ఈ శతకకర్త బ్రహ్మశ్రీ కొత్తపల్లి సుందరరామయ్యగారు. మహారాజ రాజశ్రీ శ్రీ రాజా మంత్రిప్రెగడ భుజంగరావు బహద్దరు జమీందారు వారి యాస్థానమందు సుమారు ముప్పది యేండ్లనుండి తిరాదరణ పాత్రమైన కవిగా వెలయుచున్నారు. ఈ శతకకర్త కౌసుల పురుషోత్తముని శతక మకుటమును, సుప్రసిద్ధమైయున్న అడిదము సూరకవి ప్రణాళిక ననుసరించి రచియించినట్లు తోఁచెడిని. సూరన పోయిన పోకచెలంబులోనె నిందుఁ గొత్త యూహలతో నీతులు తెలుపఁబడినవి. ఈశతకము ం మాదిరి నీతిశతకము మాటయని చెప్పఁబడగయున్నది. ఈయది ప్రాయికముగ తెల్గువాడుకలోనున్న దృష్టాంతములనే బోధించు.

ఈకవికి శ్లేషకవిత్వమునం దభిమానము మెండు. వ్రాసిన గ్రంథములలో నేమి, చాటుపద్యములలో నేమి, వీలయిన తావులయందు శ్లేషరచనం జూపుచునే యుండును. వసుచరిత్ర, మనుచరిత్ర ఈ రెంటి కథలను జోడించి "వసుస్వారోచిషోపాఖ్యాన" మను ద్వ్యర్థిప్రబంధమును రచియించెను. సర్వజన సామాన్యముగ సుబోధకముగ నుండఁదగిన యీనీతిశతకమందట్టి తావు లభింపమింగాఁబోలు శతక ముఖపత్రంబున.

"క. పురుషోత్తము మకుటంబును
శిరమునఁనిడి యడిద మొకఁడు చేకొనినదునన్
పరవిజయ లక్ష్మి చేకుఱు
టరుదే! రామునకు నిశ్చయంబుగ ధరణిన్."

అను నొక కందపద్యమును సంఘటించెను. పురుషోత్తము మకుటంబును = శ్రీమన్నారాయణమూర్తి యంశమునం గలిగిన కిరీటమును, శిరమున నిడి = శిరస్సునఁ బెట్టుకొని, అడిద మొకఁడు చేకొని = కత్తిని చేఁబూని,

నడువన్ = సంచరించిన యెడల, రామునకున్ = శ్రీరామచంద్రునకు, నిశ్చయంబుగన్, ధరణిన్ = భూమియందు, వరవిజయలక్ష్మి = లక్ష్మీ స్వరూపురాలయిన సీత, చేకుఱుట = లభించుట; అరుదే = వింతయా ? (కాదనుట) ఇది యర్థాంతరము. కవిభావమేమనఁగా పురుషోత్తము మకుటంబును = కౌసుల పురుషోత్తమకవి శతకపద్య మకుటమును, శిరమున నిడి = తలనిడికొని (అనఁగా శిరసావహించి) అడిదమొకఁడు చేకొని నడువన్ = అడిదము సూరకవి ప్రణాళిక ననుసరించి కవిత్వరచన నడిపినచో, రామునకు = సుందరరామయ్యకు, ధరణిన్ = ఫలవంతమయిన భూమిమూలమున, నిశ్చయంబుగన్ = సత్యముగా, (తప్పక) వరవిజయలక్ష్మి = శ్రేష్ఠమయిన జయలక్ష్మి, చేకుఱుట = లభించుట, (కలిమిసమకూడుటయనియు) అరుదే = వింతయా ! అని స్ఫురియించుచున్నది. ఈ శతకకర్తయొక్క యాశయముం గనిపెట్టి కృతిపతులగు శ్రీ రాజావారు తద్వాంఛితము సఫలంబు చేయుదురని నమ్ముచున్నాఁడను.

పద్యరచనాభంగి ధారాళధారలో నే పాలుపారు. ఈకవి ఇంతకు మున్ను పెక్కుగ్రంథములు రచియించి యుండెను. ఇది క్రొత్తగాదు. కవిత్వముంగూర్చి యంతగా వివరించి వ్రాయనవసరము లేదు. అభిజ్ఞులు గుణంబుఁగైకొని యానందింతురుగాక !

కలువలపల్లి రంగనాథశాస్త్రి.
ఏలూరు.

# భుజగభూపాలశతకము.

సీ. శ్రీమానినీమణి చిన్నాంబహృదయాం బె
ఱింగిన యుత్తమాఙ్గిగాఁగ
లక్కవరాది సల్లలితరాష్ట్రంబు పా
లనసేయు ధరణీతలంబుగాఁగ
బ్రాహ్మణక్షత్రియ వైశ్యశూద్రాన్వయ
తతులు బ్రహ్మాది సంతతులుగాఁగ
భక్తజనావనాసక్తత శరణాగ
తత్రాణవరబిరుదంబుగాఁగఁ

గీ. గద్దవెల్గొందు విష్ణ్వంశఁదాల్చితీవు
సీసశతకకృతింగొమ్ము చేసియిడితి
భోగదేవేంద్ర! నిర్మల బుద్ధిసాంద్ర!
పండితకవీంద్ర! భుజగభూపాలచంద్ర!

సీ. పోరోగిరము తిండిపోఁతు తండ్రీ! కావు
మంచనవేఱ భావించుఁ దాత;
అలకాపరి నన్ను బాలింపుమని పల్కఁ
గ్రించుదనముగఁ దలంచుఁ జక్రి;
బూచుల యెకిమీఁడ! ప్రోవుమీ నన్నన్న
హేలనగాఁగఁ దానెంచు శూలి;
తూరుపు నాఁడేలు దొరయేలు మంచన
నిందించె ననుచు గణించు వజ్రి,

గీ. కాన దేవతల నుతింపమాని, భూమి
దేవతోత్తము నుతియింపఁ దివిరినాఁడ;
భోగదేవేంద్ర! నిర్మల బుద్ధిసాంద్ర!
పండిత కవీంద్ర! భుజగభూపాలచంద్ర!

సీ. గరిక పూజలను సౌఖ్యంబిచ్చి బ్రోచెడు
  విఘ్నేశు సేవఁ గావించు టెంత ?
మాటల మెప్పించి మదిలో నిలుపఁ గాచు
  శారద భజియించు తీర దెంత?
బిల్వపత్రము నెత్తిఁ బెట్టిననైశ్వర్య
  ములనిడు శివమూర్తిఁ గొలుచు టెంత !
యడుకుల నొకగుప్పెఁడిడిన సంపత్ప్రదుం
  డగు కృష్ణునర్చించుటనఁగ నెంత !

గీ. అన్నిటసమర్థుఁడై చేయుమనిన దెల్లఁ
జేయునాతండె నరపాలుచిత్తమెక్క;
భోగదేవేంద్ర ! నిర్మలబుద్ధిసాంద్ర !
పండితకవీంద్ర ! భుజగభూపాలచంద్ర ! 3

సీ. ఉడుపతియగాచు మహోజ్జ్వలకాంతితో
  శశిరాత్రియందె ప్రశస్తిఁగాంచు,
గ్రహపతియగుచు లోకంబుల వెలయించు
  రవిదివంబుననె కీర్తనముఁగాంచు,
ఘనసరిత్పతియగుచుఁ గడఁగ్రమ్మిన సము
  ద్రుఁడు తనయిక్కనేస్తుతినిగాంచు,
నవనిస్వామిపతి యగుచు నెల్లెడను మహిమ
  యేకకార్యముననె యింపుఁగాంచు,

గీ. సారసరపతి విద్యావిహారభోగ
భాగ్యములనెప్పుడెందును బ్రతిభఁగాంచు;
భోగదేవేంద్ర ! నిర్మలబుద్ధిసాంద్ర !
పండిత కవీంద్ర ! భుజగభూపాలచంద్ర ! 4

సీ. లోకబాంధవుఁడు దివాకరుండన నేల
మనుజపాలకుఁ డట్టులనఁగఁ దగఁడె ?
ఘనకళానిధి సుధాకరుఁడనఁగా నేల
యచలాధిపతి యట్టులనఁగఁ దగఁడె ?
పురుషోత్తముఁడు కేశవుండనఁగా నేల
నరవరుం డట్టులనంగఁ దగఁడె ?
విబుధావనుఁడు దేవవిభుఁడనఁగా నేల
యవనీశ్వరుం డట్టులనఁగఁ దగఁడె ?

గీ. అరయఁగా బ్రహ్మలోకేశుఁ డనఁగఁ నేల
యనఘ రాజవతంసు నట్లనఁగఁ దగదె ?
భోగదేవేంద్ర ! నిర్మల బుద్ధిసాంద్ర !
పండిత కవీంద్ర ! భుజగ భూపాలచంద్ర ! 5

సీ. అరయఁ బరోక్షాపరోక్షఫలప్రదుం
డగు భగవంతుని యంతవాఁడు
శిష్టరక్షణదుష్ట శిక్షాసమర్థుఁడై
జానొందు దేవుని సాటివాఁడు
వివిధ గుణాగుణ విజ్ఞాన దక్షుఁడై
యలరెడు భగవంతునట్టివాఁడు
లలిత సృష్టిస్థితిలయకాల వేదియై
మొలవర్తిలు దేవుఁబోలువాఁడు

గీ. రాజనుచు నమ్మికొలిచిన భూజనంబు
భోజనంబులఁ బూజనంబుల నెసంగు ;
భోగదేవేంద్ర ! నిర్మల బుద్ధిసాంద్ర !
పండిత కవీంద్ర ! భుజగభూపాలచంద్ర ! 6

సీ. తలఁదాల్చలేదె నెమలి కన్నులను శౌరి
పేదవాఁడయ్యెనే పృథివియందుఁ
జేతను బుట్టె సంప్రీతిఁ బట్టఁడె శూలి
తగనివాఁడయ్యెనే ధరణియందుఁ
దినఁడే యిదియును నదియు నాకతానగ్ని
యపవిత్రుఁ డయ్యెనే యవని యందుఁ
గలవదే గడ్డితక్కక హారినీలంబు
విలువలేకున్నదే విశ్వమందు

గీ. ధనికు సన్నుతిసేయ సత్కవికి దాన
నేమి లోపంబు, కీర్తి నెసఁగుఁగాక ;
భోగదేవేంద్ర! నిర్మల బుద్ధిసాంద్ర!
పండిత కవీంద్ర! భుజగ భూపాలచంద్ర! 7

సీ. శాస్త్రపరిచయంబు చాలనివాఁడైనఁ
బండితుండనువాసిఁ బడయఁగలఁడు
దేశంబులెల్లను దిరుగనివాఁడైన
లోకజ్ఞుఁడనుపేరు జోకఁగాంచు
గురుకులవాసంబు నెఱుఁగనివాఁడైన
బరమవిజ్ఞానసంపత్తి నెగడు
సంసారగోష్ఠి నెసంగనివాఁడైన
ఘనతరబంధు పాలనముసేయు

గీ అటులె ద్రవ్యంబులేనివాఁడైనఁ బెద్ద
దాత యనునట్టి యుత్తమఖ్యాతినొందు ;
భోగదేవేంద్ర! నిర్మల బుద్ధిసాంద్ర!
పండిత కవీంద్ర! భుజగ భూపాలచంద్ర! 8

సీ. బంగారుపనికూటఁ బట్టుట భారంబు
సాన్నాయిపాటకు సుతిభరంబు
సంసారమున శిశుసాకుట భారంబు
కార్యంబులను బెండ్లికరముభరము
వ్యవసాయవంతుల కదనెన్న భారంబు
వ్రాఁతగానికిఁజూచి వ్రాతబరువు
వ్యభిచారపరులకు నాయువుభారంబు
జ్వరపీడితునకు భోజనముబరువు

గీ. సజ్జనునకపవాదంబు చాలబరువు
సొగరుబోఁతుల కాస్కృతి మిగులబరువు;
భోగదేవేంద్ర ! నిర్మలబుద్ధిసాంద్ర !
పండితకవీంద్ర ! భుజగభూపాలచంద్ర ! 9

సీ. వెట్టిమేకనుజంపి విందుసేయుటకన్న
బందులనిట్టుంచి పంపమేలు;
అప్పుఁజేసినయట్టి పప్పుబువ్వలకన్నఁ
గలిగినయంతలో గంజిమేలు;
పేదలఁబీడించి పెద్దకిచ్చుటకన్నఁ
జేతగాడనుచు వచింపమేలు;
తగనికార్యమునఁ బెత్తనము సేయుటకన్నఁ
జెప్పినయదియెల్ల చేఁతమేలు;

గీ. తెలియకున్నను దెలిసినట్టులు నటించు
కన్నవెట్టితనంబైనఁ గరము మేలు;
భోగదేవేంద్ర ! నిర్మల బుద్ధిసాంద్ర !
పండిత కవీంద్ర ! భుజగభూపాలచంద్ర ! 10

సీ. వేఁపగింజలనైన నోఁపవచ్చుఁ దినంగ
నేల వేమురసంబుఁ గ్రోలవచ్చు
ముష్టిఫలంబుల భుజియింపఁగావచ్చుఁ
జేదు దొండయును భక్షింపవచ్చు
నమలంగవచ్చు దిన్నఁగఁ బచ్చికాకర
మెక్కవచ్చును బాటఁ జక్కఁగాను
కుంకుళ్ళ నాకించి కుడువంగ వచ్చును
మెల్లనవిషమైన మ్రింగవచ్చు
గీ. నాత్మను విషంబు మాటలయందు విషముఁ
గల నరుండిడు సమ్మతంబుగాదు మోసవ;
భోగదేవేంద్ర ! నిర్మల బుద్ధిసాంద్ర !
పండిత కవీంద్ర ! భుజగ భూపాలచంద్ర ! 11

సీ. పయికి ముష్టిఫలంబు పరిశుభ్రముగనుండు
నాహారమునకు యోగ్యంబుగాదు ;
పయికి దర్పణమతిపరిశుభ్రముగనుండు
నమల నోరెల్ల రక్తము స్రవించుఁ ;
బయికిన మేగువు పరిశుభ్రముగనుండు
నొకఁడును దినుపయోగపడదు ;
పయికిఁ గుక్కగొడుగు పరిశుభ్రముగనుండుఁ
గరమునఁగొనిన దుర్గంధమంటుఁ ;
గీ. బయికి దుర్జనుఁడమితరూపమున వెలయుఁ
జేఁతలెల్లను జనులకుఁ జెట్టఁజేయు ;
భోగదేవేంద్ర నిర్మల బుద్ధిసాంద్ర !
పండితకవీంద్ర ! భుజగభూపాలచంద్ర ! 12

సీ. ఏనుఁగుచెవిగూబ నానికుట్టునుదోమ
కట్టిదంతము గంటు వెట్టఁగలదె!
గోడలోపలిమన్ను దోడునుజెదపుర్వు
శిలలను రజముగాఁ జేయఁగలదె!
కమసాలి లోహముల్ గరగింపఁగానేర్చుఁ
గరఁగింపఁజాలునే కరముఁగుదురు?
కవి చిత్రవర్ణనల్ కల్పించి చెప్పను
చేయఁగాఁగలుగునే చిన్నపనియు?

గీ. శక్తిమించిన కార్యముల్సలుపలేరు
చేయుదుమటంచుఁ జెనఁటులు చెడుదు రవని;
భోగదేవేంద్ర! నిర్మల బుద్ధిసాంద్ర!
పండిత కవీంద్ర! భుజగ భూపాలచంద్ర! 13

సీ. మసికట్టు కమసాలి పసఁదెల్పుఁ జుట్ట పీఁ
కెలమొత్తు వెలయాలి బలముఁ దెల్పు;
భయవిహీనత్వంబు బాల్యంబుఁ దెలుపును
బండ్లరాయిడి వెజ్జు పటిమఁ దెలుపు;
పడిచెక్కమానంబు పడవభారముఁ దెల్పు;
సంపదున్నతిని భోజనము దెలుపు;
సస్యాభివృద్ధి భూసారంబుఁ దెలుపు; మా
నసిక వృత్తము వదనంబు దెలుపు;

గీ. తూనిఁగలయాట వర్షహేతువును దెలుపుఁ
గవిసమర్థతనూహలు కరముఁ దెలుపు;
భోగదేవేంద్ర! నిర్మలబుద్ధిసాంద్ర!
పండితకవీంద్ర! భుజగభూపాలచంద్ర! 14

సీ. ఫణులెల్ల వాయుభక్షణ సేయునేగాని
 యోగంబునను ముక్తి నొందఁగలవె?
చిలుకలుపండ్లు భుజించునంతియకాని
 నిస్సంగవృత్తి గణింపఁగలవె?
గారడివాఁడు రూకలుసేయునేగాని
 శ్రీమంతుఁడై ధాత్రిఁ జెలఁగఁగలఁడె?
పిల్లఁడుచూచినదెల్లఁ దెమ్మనుగాని
 యింటిలోపలిలేమి నెఱుఁగఁగలఁడె!

గీ. కూళనోటికొలందిని బ్రేలుఁగాని
మంచియిది చెడ్డయిదియని యెంచఁగలఁడె?
భోగదేవేంద్ర! నిర్మలబుద్ధిసాంద్ర!
పండితకవీంద్ర! భుజగభూపాలచంద్ర! 15

సీ. సార్వభౌమునకైన సమకూడునొకవేళ
 నల్పమానవసహాయప్రవృత్తి;
అతిదరిద్రునకైన జతపడునొకవేళఁ
 బ్రాజ్యరాజ్యాధికారప్రసక్తి;
సుకవీంద్రునకునైనఁ జొప్పడునొకవేళఁ
 గవిసభాస్థల ఘనాగౌరవంబు;
పరమమూఢునకైనఁ బ్రాప్తించునొకవేళ
 నిశ్చలజ్ఞానమానిత ధనంబు;

గీ. శ్రీపతియటంచు గర్భదరిద్రుఁ డంచు
సుకవియంచును మూఢుఁడంచు వననేల?
భోగదేవేంద్ర! నిర్మల బుద్ధిసాంద్ర!
పండిత కవీంద్ర భుజగభూపాలచంద్ర! 16

సీ. హాస్యంబునం దాత్మమహత్త్వఁ గావించు నా
తఁడు జూచునే మంచితారకాలకు ?
బలిమిమైనోరుని జంపఁగఁ బూను హింసకుం
డాయుఃప్రమాణంబు నరయువాఁడె ?
కొంపలఁ గాల్పంగఁ గొంకని తుంటరి
కరుణఁబూనునె మూషకముల మృతికిఁ ?
బాములకోటఁ గప్పలఁ బెట్టుపాతకి
యీఁగకాల్విరిగిన నేడ్చువాఁడె?

గీ. పండితులఁదిట్టి పోసెడు పార్థివుండు
పానిసలఁదిట్టి కొట్టంగభయముఁగనునె ?
భోగదేవేంద్ర ! నిర్మలబుద్ధి సాంద్ర !
పండితకవీంద్ర ! భుజగభూపాలచంద్ర ! 17

సీ. బుడగకంటెను దిరఁబుగద ! డిండీరంబు
మెఱుపునకంటెను నుఱుముతిరము
ఘన చపేటంబునకన్న నాపుతిరంబు
తిరమపకృతికన్నఁ గరమకీర్తి
యమృతంబుకన్నఁ వృజినమెక్కుడు తిరంబు
తిరమఘుంబునకన్న నెరినికయము
పరిమళంబునకన్నఁ దిరముప్రసూనంబు
సుఖమునకన్న నసుఖముతిరము ;

గీ. అరయుడు స్థిరాస్థిరంబుల నవనిజనులు
కలకటా ! తద్విపర్యాసగుటయెగాని ;
భోగదేవేంద్ర ! నిర్మలబుద్ధిసాంద్ర !
పండితకవీంద్ర ! భుజగభూపాలచంద్ర ! 18

సీ. చెరువులోపలముంప సింధువులోముంపఁ
గలశోదకంబు లొక్కకొలగాదె ?
మూకుడులోఁదిన్నఁ బొందట్టలోఁదిన్న
క్షుత్తృప్తిమానంబొక చొప్పెగాదె ?
బొగ్గులోఁగరఁగిన మూసలోఁ గరఁగినఁ
గనకంపుఁ దూక మొక్కటియె కాదె ?
గోటిచేనొక్కిన గొడ్డంటనొక్కినఁ
బేనిప్రాణంబొక మానమెకద ?

గీ. అవనిభిక్షాధికారి లక్షాధికారి
యాత్మసంకల్పమున నొక్కఁడగునుగాదె !
భోగదేవేంద్ర ! నిర్మలబుద్ధిసాంద్ర !
పండితకవీంద్ర ! భుజగభూపాలచంద్ర ! 19

సీ. సకలలోకైక రక్షకుఁడైన నాలుబి
డ్డల బంధమునఁబడి నలుగవలయుఁ;
గవిసార్వభౌముఁడై గణన కెక్కిననైన
వరయతిప్రాసల నిరుకవలయు ;
నతులితఘన భిషగ్ఘుఁనమ్మెయున్న న
సాధ్యరోగములకు జంకవలయు ;
ననుపమపాచకాధ్యక్షుఁడైనను నార్ద్ర
కాష్ఠంబులకుఁ గస్తిఁ గాంచవలయు ;

గీ. గర్వపడరాదు తమ తమ ఘనతఁ గాంచి
యింగితజ్ఞులు వారల నీసడింత్రు ;
భోగదేవేంద్ర ! నిర్మల బుద్ధిసాంద్ర !
పండితకవీంద్ర ! భుజగభూపాలచంద్ర ! 20

సీ. గీటువంకర దిరిగిన నసహ్యాంబు వం
కరలేని మీసముల్కరము హేయ
మస్త్రంబు వంకరయైన నేహ్యాంబు వం
కరయుండమిం జంద్రకళవికార
మఱియ గ్రహగతి వంకరయైన నహితంబు
వంకరగాని చాపమ్మయోగ్య
మేలువంకరగాఁగఁ బాఱుఁ బ్రవాహమ్ము
వంకర లేని భ్రూవల్లి చిలిపి

గీ. బుద్ధి వంకరయైనచోఁ బాడముఁగ స్తి
చెవులు వంకరగానిచోఁ జెడు నృపుండు;
భోగదేవేంద్ర! నిర్మలబుద్ధిసాంద్ర!
పండితకవీంద్ర! భుజగభూపాలచంద్ర! 21

సీ. పలుచన వరిపైరుఁ, గలుపు దట్టంబైన
గోగ్రాసమునకును గొఱఁతవచ్చుఁ;
బల్లవంబులుకొఱ, బదనిక తఱచైన
ఫలభూరుహము కట్టియలకుఁ గఱవు;
సారంబు కొద్ది, పచ్చడి యధికంబైన
డొక్కలు నీరువట్టుటకుఁ గొదువ;
పుంజాబు తక్కువ, గంజి చిక్కనయైన
వలువలు దివిటిపాతలకుఁ గడమ;

గీ. రసములొచ్చును, బాదపూరణము హెచ్చు
నైన కవనంబు న్రాఁతకుహానివచ్చు;
భోగదేవేంద్ర! నిర్మలబుద్ధిసాంద్ర!
పండిత కవీంద్ర! భుజగభూపాలచంద్ర! 22

సీ. వర్షంబుగురియుచో వలదని వాపోవు
 వర్షంబులేమిఁ గావలయుననును
గాలివీచుచునున్నఁ జాలవిచారించు
 గాలిలేకున్న దుఃఖంబునందు
నిద్రగాఢంబైన భద్రంబుగాదను
 నిద్రలేకున్నఁ జింతించుచుండు
నాకలి తరుచైన నదిదరిద్రతయను
 నాకలిలేమిఁ జీకాకుఁజెందు

గీ. మానవులకెందు నిలుకడ గానరాదు,
దైవకృతమును దప్పింపఁ దరముగాదు;
భోగదేవేంద్ర ! నిర్మల బుద్ధిసాంద్ర !
పండితకవీంద్ర ! భుజగభూపాలచంద్ర ? 23

సీ. అఁటయఁ బ్రాణాధారమైన వాయువుపీవ
 కుండినతావు లెట్లొప్పకుండు ?
జీవనప్రదమయి చెలఁగువర్షములేని
 యెడ లేవిధంబున నెసఁగకుండు ?
రససముత్పాదన రతిఁదగు నాతపం
 బాలయనిపల్లెట్లు వెలయకుండుఁ !
దాపహారంబయి తద్దవెల్గొందు వె
 న్నెలలేని స్థలము లెట్లలరకుండు !

గీ. నల్లె సత్యవ్రతులులేని చోట్లనెపుడు
వన్నెఁగనకుండు; మిక్కిలి వనటఁగూర్చు;
భోగదేవేంద్ర ! నిర్మలబుద్ధిసాంద్ర !
పండితకవీంద్ర ! భుజగభూపాలచంద్ర ! 24

సీ. వేరువిత్తనముగా వెలయించెఁ గొన్నింటఁ
గొన్నింటఁ గొమ్మలఁ గూర్చిపెత్తు;
ఆకువిత్తనముగా నలరించెఁ గొన్నింటఁ
గొన్నింటఁ బూవులఁ గూర్చివిత్తు;
కాయవిత్తనముగాఁ గావించెఁ గొన్నింటఁ
గొన్నింటఁ గింజలఁ గూర్చివిత్తు;
పలుకువిత్తనముగాఁ బరగించెఁ గొన్నింటఁ
గొన్నింటమంటిని గూర్చివిత్తు;

గీ. అహహా! దైవంబుచేత మహాద్భుతంబు
దీని నెఱిఁగినవారలే జ్ఞానులవని;
భోగదేవేంద్ర! నిర్మల బుద్ధిసాంద్ర!
పండితకవీంద్ర! భుజగభూపాలచంద్ర! 25

సీ. నుసుమలసీఁగలు మెసవు, మక్షికములఁ
గప్ప భక్షించు, భేకములఁ బాము
తిను, నురగంబులఁ గొని భ్రమించు నకులంబు,
చిలుకలఁ బిల్లి భక్షించుఁ, జిలి
సారమేయము మెక్కు, గోరలఁ దినుగాకి,
పొరిగద్ద పావురంబులఁ భుజించు,
డేగగృధ్రములఁ గడింది భక్షించును
సింగంబు మెసవు నేనుంగుగములు,

గీ. నధికులగువారలల్పుల నణఁతురల్లె
యింగితజ్ఞులుగాక మహీతలమున;
భోగదేవేంద్ర! నిర్మల బుద్ధిసాంద్ర!
పండిత కవీంద్ర! భుజగభూపాలచంద్ర! 26

సీ. తనదైన జాతకంబునకుఁ బూర్ణాయువే
పట్ట విషాదులెవ్వని యొనర్చుఁ
జాలుగా శ్లేష యామూలాగ్రముగఁ బట్ట
నరసున్న తా రేఫలడ్డు పెట్టు
వేదపఠనమందు విమలస్వరమె పట్టఁ
గుత్తుక భేద మెక్కుడువఁ దెచ్చుఁ
దతబుద్ధి, రోగనిదానంబుఁ గన్పెట్టఁ
జెయిఁ జూపకుండిన భయము దేల

గీ. లలితగాయత్రి తెలిసిన తెలివిపట్ట
నిందవటునె యితరంబు నేరఁడన్న;
భోగదేవేంద్ర ! నిర్మలబుద్ధిసాంద్ర !
పండిత కవీంద్ర ! భుజగ భూపాలచంద్ర ! 27

సీ. అప్పాలమారి వేయాఋ లీఁదేలునే ?
తీపు పీకెల బాలుఁ జేపుఁగనునె ?
ఆక లేగునె చిక్కడాకు పాయసమున ?
వంకరదండాల భక్తుఁడగునె ?
గాజుపల్లెర మది ఘంటా ఫలకమానె ?
వేశ్యాలయము స్థిరవేశ్మమగునె?
కడుపక్కలింపు నిక్కపు నీరసంబౌనె ?
దర్భాసనము తూలతల్పమగునె ?

గీ. పలుకనేరనట్టిడు మితభాషియగునె !
తగనియుప్పిచ్చు వాఁడెన్న దాతయగునె !
భోగదేవేంద్ర ! నిర్మలబుద్ధిసాంద్ర !
పండితకవీంద్ర ! భుజగభూపాలచంద్ర ! 28

సీ. దోటిఁదింపినకాయ దొడ్డఫలంబౌను;
గాలిఁబడ్డ శలాకువోలిఁ గుళ్ళుఁ;
దల్లి యొసంగల తనయుండు వర్ధిల్లుఁ;
దండ్రిపాలైన పుత్రకుఁడు చెడును;
ఆతపంబునఁబడ్డ యంభోజము వెలుంగుఁ;
జంద్రికఁగను సరోజంబు కమలు;
విప్రునోటనుబడ్డ వేదంబు ఫలియించు;
శూద్రునోటనుబడ్డ శ్రుతియడంగుఁ;

గీ. పాత్రమునఁబడ్డ విత్తంబు ప్రతిభనిచ్చు;
హీనగతిఁ జేరు ద్రవ్యంబు హానిఁదెచ్చు;
భోగదేవేంద్ర ! నిర్మలబుద్ధిసాంద్ర !
పండితకవీంద్ర ! భుజగభూపాలచంద్ర! 29

సీ. గ్రుడ్డివానికిలేరె కూరిమి సేవకుల్ ?
హింసకునకుఁ బురోహితుఁడు లేడె ?
తోడుబాయక యుంట తుమ్మునుంటికి లేదె !
యీఁకవులేదే తేనెటీఁగలకును ?
సింహాసనమున వసింప వేనల్లులు ?
గణికకు లేదె భోగంపుబేరు ?
అహితుండికునకు లేదా నరేంద్రపదంబు ?
కోడికిఁబౌరుష గుణము లేదె ?

గీ. రాజరాజులమనెడు గర్వంబుతగదు;
సర్వజన సౌహృదంబె యశస్సుఁగూర్చు;
భోగదేవేంద్ర ! నిర్మలబుద్ధిసాంద్ర !
పండితకవీంద్ర ! భుజగభూపాలచంద్ర ! 30

సీ. స్వర్ణంబుతోఁగూడ సరిదూఁగు గురివెంద
విలువగడింపంగఁ గలిగెనొక్కొ?
పూవులన్నిటి హితంబునఁగూర్చుదారంబు
వలపునఁదెలియంగఁ గలిగెనొక్కొ?
షడ్రసోపేత భోజనమువెట్టెడుదర్వి
లలిరుచిగ్రహియింపఁ గలిగెనొక్కొ?
దీపంబుఁగాంతికిఁ దెచ్చెడుతైలంబు
కాంతిసంపాదింపఁ గలిగెనొక్కొ?

గీ. సితిబోధనయందున నిపుణుఁడైన
నరుఁడు నయశాలియై తాను నడచుటరిది;
భోగదేవేంద్ర! నిర్మలబుద్ధిసాంద్ర!
పండితకవీంద్ర! భుజగ భూపాలచంద్ర! 31

సీ. కార్పాసరసమును గడియింపఁగా వచ్చుఁ
బిడికిటవ్యోమంబుఁ బెట్టవచ్చు
నావాల జల్లెడయం దాపఁగావచ్చు
నగ్నినిగాలిఁ జల్లార్పవచ్చుఁ
బిచ్చుక నొగి నడిపింపంగ వచ్చును
బేలాల విత్తులు బెట్టవచ్చు
సూదిమొనం గడ్వనూది నిల్పఁగవచ్చుఁ
గలువకాడను దంతిఁ గట్టవచ్చు

గీ. దబ్బనంబునఁ జెప్పును ద్రవ్వవచ్చుఁ
గాని వాచాలునోరును గట్టరాదు;
భోగదేవేంద్ర! నిర్మలబుద్ధిసాంద్ర!
పండిత కవీంద్ర! భుజగ భూపాలచంద్ర! 32

సీ. విలయకృశాను కీలల గ్రుగ్గి మసియైన
భువనముల్ క్రమ్మరఁబుట్టకున్నె
యేకజలార్ణవంబై కడగానని
భూతధాత్రితిరుగఁ బొడమకున్నె
ఖరకరోష్ణమయూఖ కాండతప్తంబైన
కలువ వెండియు శోభఁగాంచకున్నె
లోతుగా భూమిని బాతునఁ బడిగింజ
పదపడి మొక్కయై ప్రబలకున్నె
గీ. ఘన విపద్దశమున్గి దుఃఖపడు మర్త్యుఁ
డోలి నానందవార్ధిని దేలకున్నె
భోగదేవేంద్ర! నిర్మలబుద్ధిసాంద్ర!
పండిత కవీంద్ర! భుజగ భూపాలచంద్ర! 33

సీ. అన్నల దారిద్ర్యమడఁపఁ దలఁపఁడు
తోడియల్లుండ్రకుఁ దోడుపడును
కొడుకులఁ కష్టంబుఁగూర్చి యోజింపడు
పూఁతులచాకిరీ ల్గోరిచేయు
* మనుమని పెంపకంబునకు మోదింపఁడు
వారసులకును ద్రవ్యంబువెట్టు
బావబిడ్డలుగంజిఁ దాగ్రివసహింపదు
తోబుట్టువులకెల్లఁ దుడిచిపెట్టు
గీ. ధరణినైజగుణంబు లిక్కరణినుండుఁ
దాముజేసెడుపనులె శుద్ధంబులండ్రు;
భోగదేవేంద్ర! నిర్మలబుద్ధిసాంద్ర!
పండితకవీంద్ర! భుజగభూపాలచంద్ర! 34

* దౌహిత్రునొకని దత్తత జేసికొనఁబోడు.

సీ. చేరులు దెగినట్టి చిక్కంబునుంబోలెఁ
బ్రాసయతులులేని పద్యమట్లు
నేడుముల్లూడిన చీరనేఁతనుబోలె
దారంబు తెగిన పతంగమట్లు
మొరవోయియున్నట్టి కరవాలముంబోలెఁ
గన్నంబువడినట్టి కడవరీతి
గండివడిన తటాకంబును బోలె బో
నంబువోయిన మృదంగంబురీతి

గీ. ఉత్తముండగు మంత్రిలేకున్న రాజు
హితముఁగనలేడు పైపెచ్చు వెతలువచ్చు;
భోగదేవేంద్ర నిర్మలబుద్ధిసాంద్ర!
పండితకవీంద్ర! భుజగభూపాలచంద్ర! 35

సీ. పండితుండగురాజు పౌరాణికునిచేతఁ
గథలాలకించుట కరుణగాదె
కుట్టనేర్చినతన్వి కుబుసముల్ కుట్రపు
వానికిచ్చుట దయాపరతగాదె
దుర్జనతన్ద్రవ్య మార్జించునాతండు
హితులకుఁబెట్టుట కృపయకాదె
వెట్టియాతఁడు రాతబుట్టఁ బగులఁగొట్టి
కడుజాలిఁబడు కనికరముగాదె

గీ. అరయననుకంప సర్వకార్యములయందు
నధిక సూక్ష్మస్వరూపంబు నందియుండు;
భోగదేవేంద్ర! నిర్మలబుద్ధిసాంద్ర!
పండితకవీంద్ర! భుజగభూపాలచంద్ర! 36

సీ. ఉరగంబుగరువ వ్రేల్నరుకు బ్రాణముఁగావ
నతనిడెందము దయాన్వితముగాదె
గాయంబుబాధచేఁ గ్రాగుచోఁగారంబు
దురుమువానికిఁ గనికరములేదె
రోగంబునను బాధ రోగుజంతువుఁదుపా
కినిజంపులేదె యాతనికిఁగరుణ
చంటిబిడ్డగుణంబు సమకొనఁజుట్టచేఁ
వెగఁగాల్చును గృపలేదేయతనికి

గీ. అరయననుకంప సర్వకార్యములయందు
నధిక సూక్ష్మస్వరూపంబు నందియుండు
భోగదేవేంద్ర ! నిర్మలబుద్ధిసాంద్ర !
పండితకవీంద్ర! భుజగభూపాలచంద్ర ! 37

సీ. చేనుమేసెడుగోవుఁ జెచ్చెఱఁగొట్టుట
పుణ్యమోపాపమో పోల్పవశమె ?
కోడిఁబట్టినకుక్క గుదెగొనిమోదుట
పుణ్యమోపాపమో పోల్పవశమె ?
దొంగకన్నములోన దొరికినఁజంపుట
పుణ్యమోపాపమో పోల్పవశమె ?
మత్కుణంబులనెండ మలమలమాడ్చుట
పుణ్యమోపాపమో పోల్పవశమె ?

గీ. పాపపుణ్యముల్ సూక్ష్మరూపంబుఁదాల్చి
కంటికగపడకుండ నన్నింటనుండు ;
భోగదేవేంద్ర ! నిర్మలబుద్ధిసాంద్ర !
పండితకవీంద్ర ! భుజగభూపాలచంద్ర ! 38

సీ. గాజుకంటికిఁ జల్వ కాటుకయదియేల
బోడకాలికి రత్నభూషయేల
యాత్మస్తుతుల్కుబ్బు నతనికి యశమేల
జాత్యంధునకు దవ్వె సాయమేల
మాలకూడుఁదినంగ మడిఁగట్టఁగానేల
గంజిఁద్రావఁ బసిండికంచమేల
వారకామినులకు వావివరుసలేల
ఖలునిచేతకు మంచి కాలమేల

గీ. అప్పునుగానితీర్పని పురుషాధమునకు
కుమనుగన్గొన గౌరవసౌఖ్యమేల
భోగదేవేంద్ర ! నిర్మలబుద్ధిసాంద్ర !
పండితకవీంద్ర ! భుజగభూపాలచంద్ర ! 39

సీ. ద్విరదంబుభీతిల్లఁ జేసునిశ్చయముగ
వ్రేలాడుసింగంబు జూలువట్టి ;
ఆవుదవ్వఁగఁ బాఱి పోవు వ్యాఘ్రముఁగని
యీఁగతాలువులాల మూఁగియాను ;
కుజములు పెళపెళఁ గూలు నల్పపుఁదీవ
గాడుపుతోడఁ దూగాడుచుండుఁ ;
బడవత్రొక్కిల్లుఁ దుపానుచేఁగడలి ము
త్యపుచిప్పలలిఁ దేలి యాడుచుండు ;

గీ. సుకవిజంకొందుచుండును సూరిసభలఁ
జవట కుకవీశ్వరుండు తాండవముసేయు ;
భోగదేవేంద్ర ! నిర్మల బుద్ధిసాంద్ర !
పండితకవీంద్ర ! భుజగభూపాలచంద్ర ! 40

సీ. కావ్యకాంతియుఁ బురాణవ్యాసయనునంతఁ
 గవులుగర్వంబునఁ దవులరాదు ;
శాస్త్రిసత్కవిరాజ శబ్దముల్ గలయంత
 నగదంకరులు గర్వమంద రాదు ;
శతశిల్పిశిల్పి పంచానన యనఁజిత్ర
 కారులుగర్వంబుఁ గాంచరాదు ;
నటరాజనటభృంగి రిటయను నంతఁ గు
 శీలవుల్గర్వంబుఁ జెంద రాదు ;

గీ. తాడిఁదన్నునాతని తలఁదన్నునతఁడు
వసుధగల్గుటనేరు గర్వపడ రాదు ;
భోగదేవేంద్ర ! నిర్మలబుద్ధిసాంద్ర !
పండితకవీంద్ర ! భుజగభూపాలచంద్ర ! 41

సీ. తినఁగూడనట్టివితినిరోగమును దెచ్చు
 కొనుఁగానిపోఁగొట్టు కొనఁగలండె ?
చెప్పఁగూడనియవి చెప్పి వైరముఁ దెచ్చు
 కొనుఁగాని తప్పించుకొనఁగలండె ?
చేయఁగూడనివానిఁ జేసిపాపముఁదెచ్చు
 కొనుఁగాని విడిపించు కొనఁగలండె ?
కోరఁగూడనివానిఁ గోరికష్టముఁదెచ్చు
 కొనుఁగాని మరలించు కొనఁగలండె ;

గీ. ఈయఁగూడని యవియెల్ల యిచ్చిచెట్టఁ
దెచ్చుకొనుఁగాని దానిని బుచ్చఁగలఁడె ?
భోగదేవేంద్ర ! నిర్మలబుద్ధిసాంద్ర !
పండితకవీంద్ర ! భుజగభూపాలచంద్ర ! 42

సీ. శిల్పికారుఁడుఁ గవిఁశేఖరుండును నొక్క
  టైనశిల్పిధనంబు నందుఁబెద్ద
వారకాంతయు న్యాయవాదియు నొకటైన
  గణికభాగ్యంబున గణ్యురాలు
వైద్యుండు మఱియుదైవజ్ఞుండు నొకటైన
  నగదంకరుఁడు ద్రవ్యమందు మేటి
పౌరోహితుండు సేవకుఁడు నొక్కటియైనఁ
  గులవసిష్ఠుఁడు సంపదల ఘనుండు,

గీ. ఉర్విరాజు విద్వాంసుండు నొక్కటైనఁ
ఒండితుండు నిర్ధనుఁడయి బ్రతుకుచుండు ;
భోగదేవేంద్ర ! నిర్మలబుద్ధిసాంద్ర !
పండితకవీంద్ర ! భుజగభూపాలచంద్ర ! 43

సీ. నేలగుమ్మడుకాయ ప్రీలగొట్టనికాంత
  వెలిచవుల్మరిగి చంపించుమగని
పాగచుట్టఁగాల్చుట తగదనునాతండు
  మద్రైన్మత్రిఁగలుఁదాగివి దొర్లుచుండుఁ
తులసీదళంబేనిఁ దుంపనోపనియాపె
  కడఁక, విధవకూఁతు కడుపుదింపు
గోరుఁబంటఁ గొరుకఁగూడదంచనునాతఁ
  డతిక్రోపమున నరహత్యసేయుఁ

గీ. గటకటా! లోకచర్యయిక్కరణినుండ
నరులనమ్మకవుంబల్కు నమ్మెట్లు !
భోగదేవేంద్ర ! నిర్మలబుద్ధిసాంద్ర !
పండిత కవీంద్ర ! భుజగభూపాలచంద్ర ! 44

సీ. కుబుసమూడ్చినయట్టి కుంభీనసముఁబోలెఁ
బట్టలూడిన యుల్లిపాయఁబోలెఁ
జిత్రికఁదోమిన చిళ్ళకట్టెనుబోలెఁ
బొరలూడఁ బెరికిన యరఁటిఁబోలె
సానఁబట్టిన వజ్రశకలంబునుంబోలెఁ
గత్తిగీచిన గోఁగుకట్టఁబోలెఁ
గోటరాచిన మంటిగుండునుంబోలెను
పనిముటుకూరిన పలకఁబోలె

గీ. ఘనతరాజ్ఞానమును బాసి మునివరుండు
జ్ఞానతేజంబుతోడఁ బ్రకాశముఁగను;
భోగదేవేంద్ర! నిర్మలబుద్ధిసాంద్ర!
పండితకవీంద్ర! భుజగభూపాలచంద్ర! 45

సీ. తనువృంతసంతతి, తతపత్రసంతతి
గలిగినఁగాదొకో చలదళంబు?
ఆదాయమల్పంబు వ్యయమధికంబైన
నేలకాకుండు దివాలకోరు?
పూర్ణాదితక్కువ భూరియున్నతిమైనఁ
గూలదే నేలపైఁ గుడ్యసమితి?
తైలంబుకొఱఁతె విశాలంబువత్తిగా
దీపమారుటకెంత సేపుపట్టు?

గీ. నరయఁగాఁ దెల్వితక్కువ యూకలెక్కు
వయునయినవాని జీవయాత్ర యెటుసాగు?
భోగదేవేంద్ర! నిర్మలబుద్ధిసాంద్ర!
పండితకవీంద్ర! భుజగభూపాలచంద్ర! 46

సీ. వేదపారగుఁడైన విప్రుని కవనంబు
పరిపక్వమయినట్టి ఫలమురసము
వృద్ధత్వముననున్న భిషజుని వైద్యంబు
సూరియౌబాలుని జ్యోతిషంబు
కంఠమాధుర్యంబు గలుగుసంగీతంబు
కాకయెఱింగిన కంచరంబు
రసమాన మెలమిఁ దెలిసిన యాతనివంట
యర్థంబుఁ దెలిసిన యభినయంబు
గీ. బలవిశేషంబుఁ గలయట్టి పార్థివుండు
శాంతమతియుతి, క్షితినిబ్రశస్తిఁగాంచు;
భోగదేవేంద్ర! నిర్మలబుద్ధిసాంద్ర!
పండితకవీంద్ర! భుజగభూపాలచంద్ర! 47

సీ. లయలేనివాద్యంబు దయలేనిపాద్యంబు
హృద్యంబులగునె మహీతలమునఁ!
మదలేనికవనంబు నెదలేనియవనంబు
భువనంబులను ఖ్యాతిఁ బొందఁగలవె?
రుతిలేనివీణయు మతిలేనివాణియుఁ
బాణియుక్తములంచుఁ బలుకఁదగునె?
రుచిలేని పాకంబు శుచిలేనిలోకంబుఁ
బ్రాకట సౌఖ్యసంపత్తినిడునె?
గీ. దురములేని సేనానియుఁ దురుములేని
మానినియు వన్నెవాసియు నూనఁగలరె:
భోగదేవేంద్ర! నిర్మలబుద్ధిసాంద్ర!
పండిత కవీంద్ర! భుజగభూపాలచంద్ర! 48

సీ. ఉన్నంతసేటిని నూరివారలకిచ్చి
వట్టిన చెరువునదెట్టియీగి
ఘనతకై ధనమెల్లఁగర్చొనరించి యిం
కెట్టులో యనువానిదెట్టియీగి
ఒకనిరసముఁ బీల్చి యుర్వి నెల్లెడఁజిమ్మి
మట్టమౌ సూర్యునిదెట్టియీగి
ఎచ్చటనో యప్పుదెచ్చి పల్వురకిచ్చి
యేఁబెద్దనను వానిదెట్టియీగి
గీ. చెమటనూడ్చి సంపాదించి యమరులకిడి
లోఁగకార్జించు చంద్రునదీగిగాక;
భోగదేవేంద్ర! నిర్మలబుద్ధిసాంద్ర!
పండితకవీంద్ర! భుజగభూపాలచంద్ర! 49

సీ. దారుజంత్రంపు సాధనమునఁదేరిన
మార్గంశికుఁడు దానిమరచినట్లు
ఘనశిలాఫలక లేఖనఁబండితుండైన
కవి దాని మరపునుగాంచునట్లు
గురిఁబెట్టికొట్టి నేర్పరిమైన విలుకాఁడు
ముందువానిమరపుఁ జెందునట్లు
పలుమారువ్రేళ్లు లెక్కలువెట్టి గణకుఁడై
పరగువాఁడద్దాని మరచునట్లు
గీ. పరమగురుమూలమునజ్ఞాన మరయనేర్చి
మానియైవాని మనమున మరపుఁజెందు;
భోగదేవేంద్ర! నిర్మల బుద్ధిసాంద్ర!
పండిత కవీంద్ర! భుజగ భూపాలచంద్ర! 50

సీ. వానచేఁజీర్ణమైనాని యొరంగిన
కుడ్యంబునేలపైఁ గూలుటెంత
యెండనత్యంతంబు నెండినచొప్పాకు
సుడిగాలిమిన్నంటు చొప్పదెంత
దగఁగొనియాఁకలిఁ దగిలిచిక్కినకరి
పంకంబుననుగూలఁ బడుటయెంత
యారిపెళ్ళుశలాడునట్టి ప్రాఁదాటాకు
కొంపనిప్పునను భగ్గుమనుటెంత

గీ. అప్పులను ముగ్గిసంసృతిఁ దెప్పరిలని
సజ్జనుఁడు తెంగచేతను జచ్చుటెంత ?
భోగదేవేంద్ర ! నిర్మలబుద్ధిసాంద్ర !
పండితకవీంద్ర ! భుజగభూపాలచంద్ర ! 51

సీ. చెడుగుడీయాటలఁ జేరిపట్టుటగాదు
బలవద్విరోధి సంపద్ధరణము
దాగుడుమూఁతల దాగియుండుటగాదు
ప్రారబ్ధకర్మ దూరప్రవృత్తి
త్రొక్కుడుబిళ్ళల దూకిదాటుటగాదు
ఘోరసంసృతి సముత్తారణంబు
వాతగిల్లాదండి కూఁతఁగూయుటగాదు
కేవలదైవ సంకీర్తనంబు

గీ. చెముడుగాడలక్షోడిపందెములుగావు
పండితోత్తము వాగ్వాదపటిమయెన్న ;
భోగదేవేంద్ర ! నిర్మల బుద్ధిసాంద్ర !
పండితకవీంద్ర ? భుజగభూపాలచంద్ర ! 52

సీ. తేలుకొండెమునకుఁ దేనెబూసినయంత
విషముపోవునెవట్టి వెఱ్ఱిగాక
దురదగొండికిఁ గల్ప తరువుప్రాకిడినంత
విడుచునే నూగును వెఱ్ఱిగాక
మొదలునబెల్లంపుఁ బొడివోసినంతన
వేముచేదువిడునె వెఱ్ఱిగాక
గచ్చపప్పునునేత వెచ్చజేసినయంత
వెగటుమానునెవట్టి వెఱ్ఱిగాక
గీ. మంచిబుద్ధులుగఱుప దుర్మార్గమతికి
నైజగుణములుమాన వెన్నటికినైన
భోగదేవేంద్ర నిర్మల బుద్ధిసాంద్ర !
పండితకవీంద్ర ! భుజగభూపాలచంద్ర ! 53

సీ. పసరంబునకునావ నొసఁగినచందానఁ
బిల్లినెత్తిని వెన్నఁ బెట్టినట్లు
బిచ్చ్యానకెంకాయఁ బెట్టినపోలిక
నుష్ట్రపైఁ దడిగుడ్డఁ గప్పినట్లు
పువ్వుదేనెను నీటిబొట్టు వైచినరీతి
క్షీరమునంజల్లఁ జిలికినట్లు
దేవస్థలము నంటుఁగావించినవితాన
ఘనహవ్యమునఁ బేడఁగలిపినట్లు
గీ. అనవసరముగ సజ్జనునందు నింద
మోపినవతండు నిముసమేనోపలేఁడు;
భోగదేవేంద్ర ! నిర్మలబుద్ధిసాంద్ర !
పండితకవీంద్ర ! భుజగభూపాలచంద్ర ? 54

సీ. మహిం ధూళిఁ బాప సమ్మార్జనిదగుఁగాక
చామరంబున నదిచక్కఁబడునె?
తిమిరంబునడఁపంగ దీపంబు దగుఁగాక
జ్యోతిరింగణములచేత నగునె?
జడివాననాపంగ ఛత్రంబుదగుఁగాక
తాళవృంతంబాపఁ జాలునెట్లు?
కూటిరయావిరిని మూకుడు నిల్పఁదగుఁగాక
దర్వికట్టఁలది సాధ్యపడఁగలదు

గీ. దానిదానికిఁదగిన మర్త్యతతినేరి
పనులు నియమింపవలయును పార్థివుండు;
భోగదేవేంద్ర! నిర్మల బుద్ధిసాంద్ర!
పండితకవీంద్ర! భుజగభూపాలచంద్ర! 55

సీ. ఉరుములేకున్నను గురియును వర్షంబు
మబ్బులేకున్న నేమాడ్కిఁ గురియు!
ననిలేకయున్న రాజ్యమువృద్ధినింగాంచు
రాజులేకున్న నేయోజవెలయు!
కలువలేకున్నను గొలనువిరాజిల్లు
జలములేకున్న నే చాయఁదనరు!
ఫలములులేకున్నఁ బాదపంబలరారు
ఛదములు లేమినేచక్కినొప్పుఁ?

గీ. జదువులేకున్నఁ దెలివినెసంగవచ్చు
బుద్ధిలేకున్నఁ దెల్వినెప్పోల్కిఁగాంచు?
భోగదేవేంద్ర! నిర్మల బుద్ధిసాంద్ర!
పండితకవీంద్ర! భుజగభూపాలచంద్ర! 56

సీ. పండితుండు పోగాకు భాగాలునమలిన
నది గౌరవంబని యనఁగఁదగునె?
కవిసార్వభౌముండు గణికపొత్తుననున్న
నదిరసికతయంచు నాడఁదగునె?
విరుగఁడెఱుఁగు వెజ్జు విషమును మ్రింగిన
నదిసమర్ధతయని యనఁగఁదగునె?
చిత్రకారుఁడు నగ్నచిత్రంబులను వ్రాయ
నది నిపుణతయంచు నాడఁదగునె?

గీ. తోడరిశతవృద్ధు పచ్చిబూతులు వచింప
నదిసమంజసమైనదం చనఁగఁ దగునె!
భోగదేవేంద్ర! నిర్మల బుద్ధిసాంద్ర!
పండిత కవీంద్ర! భుజగ భూపాలచంద్ర! 57

సీ. చేతిపనులఁ ద్రోసి వేతఁగావించెఁ గ్ర
మమ్మొప్పఁగాఁబెక్కు మరలువచ్చి
పఠనపాటవముఁ బోనఁగజేసెఁ గ్రమముగా
ఘనగద్య నైఘంటికములువచ్చి
ఆరోగ్యభాగ్యంబు నంతంబు నొందించెఁ
గ్రమముగాఁ గాఫియుంగడులువచ్చి
దేశభాషలను దుస్థితికిఁ దెచ్చెఁ గ్రమమ్ము
గానన్యభాషలు కడఁకవచ్చి

గీ. కటకటా! యిట్టిదుర్గతిఁ గానలేక
క్షితినిజనులిది నాగరకతయటంద్రు;
భోగదేవేంద్ర! నిర్మల బుద్ధిసాంద్ర!
పండిత కవీంద్ర! భుజగభూపాలచంద్ర! 58

సీ. అలరువిల్తుఁడు విరహార్తులఁ బీడించుఁ
గోయ్యభామ్మలకార్తిఁ గూర్పఁగలఁడె?
వైద్యుండుకాయిక వ్యాధినిఁబోఁగొట్టు
మానసికవ్యాధి మాన్పఁగలఁడె?
జ్యోతిషికుఁడు గ్రహశాంతి వక్కాణించు
గ్రహచారమును నాపఁగాఁగలండె?
యాచకుండల మహాత్యాగినలంచు నీ
యని లుబ్ధుబాధ సేయంగలండె?

గీ. సత్యవాదిని బాధింపఁ జాలుఁజెనఁటి
యనృతవాదిని జేరి మాటాడఁ గలఁడె?
భోగదేవేంద్ర! నిర్మలబుద్ధిసాంద్ర!
పండితకవీంద్ర! భుజగభూపాలచంద్ర! 59

కలహంసలకు నడకలు జెప్పిరెవ్వారు
చిలుకకునుడినేర్పుఁ జెప్పిరెవరు
నెమ్మికినృత్యంబు నేరిపిరెవ్వారు
కపికెల్లచేష్టలుఁ గఱపిరెవరు
సరఘుణ్ణొసంగి రార్జనశక్తి నెవ్వారు
చిలువకుఁబగఁబట్టఁ జెప్పిరెవరు
జంబుకంబునకు వంచననేర్పి రెవ్వారు
గ్రద్దకుగుఱినేర్పు దిద్దిరెవ్వ

గీ. రిలను బేదకు దాతృత్వమిచ్చిరెవ్వ
రన్నిటికి నీశ్వరుఁడె కర్తయైనవాఁడు;
భోగదేవేంద్ర! నిర్మలబుద్ధిసాంద్ర!
పండితకవీంద్ర! భుజగభూపాలచంద్ర! 60

సీ. ఒడలెల్లఁగన్నుల నొప్పినమాత్రనే
బర్హి యింద్రత్వంబుఁ బడయఁగలదె?
ఆఱు మొగంబుల నలరునంతటనె నై
కాంతంబు స్కందత్వ గరిమఁగనునె?
కంఠనైల్యంబును గాంచినయంతనే
కలవింక మీశతఁ గాంచఁగలదె;
స్వర్ణరేణువుఁ బు గర్భమునఁ గలంత రా
జావర్తమజత నెసంగఁగలదె?

గీ. కత్తిఁ జేఁబట్టినంత మంగలియు వక్ర
విక్రమక్రమశాలియై వెలయఁగలఁడె?
భోగదేవేంద్ర! నిర్మల బుద్ధిసాంద్ర!
పండితకవీంద్ర! భుజగభూపాలచంద్ర! 61

సీ. అశ్వంబు పాదద్వయంబునఁ దన్నినం
చట్లుగావింప నేమగునునరుఁడు
ఏనుంగు ముకునోళ్ళఁ బానంబు సేయునం
చట్లుగావింప నేమగునునరుఁడు!
కాలెక్కలను బక్షిగమనంబు సేయునం
చట్లుగావింప నేమగునునరుఁడు?
నిలిచియును బరుండి నిద్రించుఁ బసరమం
చట్లుగావింప నేమగునునరుఁడు?

గీ. పులిని గన్గొని నక్కవాత లిముకొన్న
చందమునఁ జేతగానిది సలిపి చెడును;
భోగదేవేంద్ర! నిర్మలబుద్ధిసాంద్ర!
పండితకవీంద్ర! భుజగభూపాలచంద్ర! 62

సీ. అతియత్నమునఁ బెంపమతి నూహసేసిన
గొప్పదై ఫలమీను కుక్కగొడుగు
వ్రతములయాత్రల మితిమీఱఁ జేయింప
బిడ్డలఁగనలేదు గొడ్డురాలు
పలుకులెన్నినియుఁ బలుకంగఁ జెప్పిన
నర్థంబెఱుఁగఁ జాలదవసిఁజిలుక
కడుపెదబిడ్డలఁగను భాగ్యమేగాని
యెఱుఁగదుపీత పుత్రేషణంబు

గీ. వినఁబురాణంబు లెన్నిసివివరముగను
మంచివృత్తంబుఁగొనఁడు దుర్మార్గుఁడెపుడు;
భోగదేవేంద్ర! నిర్మలబుద్ధిసాంద్ర!
పండితకవీంద్ర! భుజగభూపాలచంద్ర! 63

సీ. ఎక్కువగాఁ బాలనిచ్చిననిచ్చుఁగా
కట్టునేబఱ్ఱెల కాలఘనత?
ఘనతరైశ్వర్యంబు గలిగినఁగలుగుఁగా
కెట్లబ్బుద్విజత ద్విజేతరునకు?
పెక్కుగాఁబిల్లలఁ బెట్టినఁబెట్టుఁగా
కబ్బునేకిరిగి గజానుభూతి?
జేనెడుపువ్వుబూచినఁ బూచుఁగాకయు
మ్మెత్తకెట్లబ్బు శమీమహిమము?

గీ. సర్వశాస్త్రముల్ జదివినచదువరులకుఁ
గలుగదిసుమంతయేనియుఁ గవియశంబు;
భోగదేవేంద్ర! నిర్మలబుద్ధిసాంద్ర!
పండితకవీంద్ర! భుజగభూపాలచంద్ర! 64

సీ. భోగినివలపును భాగ్యుల తెలుపును
వేముతీపియు నత్త్రప్రేమ లేదు;
ఈవిచేఁ జెడునది చావవచ్చెడునది
కత్తిమెత్తన స్నుషక్రొత్త లేదు;
కప్పకుఁగాటు నగ్రజునకుఁబోటు ముం
తకుఁజెవుల్ కథకుఁబాదములు లేవు;
బట్టతలను బేను బసిఁడికిఁ దావియుఁ
గలబందయెండు దొంగదయ లేదు;

గీ. వసుధనిట్టివి కలవను పరమ వంచ
కాధముల వాక్యములను సత్యంబు లేదు;
భోగదేవేంద్ర ! నిర్మలబుద్ధిసాంద్ర !
పండితకవీంద్ర ! భుజగభూపాలచంద్ర ! 65

సీ. తెన్నుఁగానకచాల ఖిన్నుఁడౌవానికి
మార్గదర్శిమహర్షి మాడ్కివాఁడు;
వ్యాధిభారంబున నల్లాడువానికి
వెజ్జుధన్వంతరి విధమువాఁడు;
అజ్ఞానతిమిరంబునందు మున్గినవాని
కాచార్యుఁడీశ్వరు నంతవాఁడు;
ఆపదలందు భయంబందువానికి
సుహృత్తుమందు జనకునిచొప్పువాఁడు;

గీ. జ్ఞానహీనులు వీరలఁగడకుఁద్రోతు
రేటుఁదాటెనఁ దెప్పయుఁ కేల ? యనుచు;
భోగదేవేంద్ర ! నిర్మలబుద్ధిసాంద్ర !
పండితకవీంద్ర ! భుజగభూపాలచంద్ర ! 66

సీ. ఇసుకలోఁబుట్టదే పసిఁడికళంకుదుమ్ము?
బాడిజనింపదే పంకజంబు?
పాడమవేతావిపూవులుముండ్ల చెట్లను
గుల్లలోఁ బుట్టదొకో సువాణి?
శుష్కేంధనంబున శుద్ధాగ్నియొకవదే?
మబ్బునఁబుట్టదే మంచిమెఱుపు?
గరమునఁ బాణిరక్షణ మహత్వముఁలేదె?
చొప్పడదే సత్తతిప్పతీఁగ;

గీ. నల్పమానవునందైన నధికగుణము
గలుగవచ్చును దణిగర్వ మాఁగఁదగదు;
భోగదేవేంద్ర! నిర్మలబుద్ధిసాంద్ర!
పండితకవీంద్ర! భుజగభూపాలచంద్ర! 67

సీ. ఆతపత్రఖ్యాతి నందిన ఛత్రంబు
వాననుదడుపునే మానవులను
కీలినినెగడించు తాళవృంతమ్ముతా
పమ్మున ముంచునే ప్రాణికోటి
నుప్పునీరునమించు నుదధిమేఘుద్వారం
మునఁ దీయనీరిదె భువనమునకుఁ?
జోరులకార్తిని గూరుచుచంద్రుండు
వృక్షులతాదులఁ బెంచకున్నె?

గీ. చెలఁగి యరులనొంచెడు రాజసింహుఁడవనిఁ
గోరిపోషింపఁడే కవికుంజరులను;
భోగదేవేంద్ర! నిర్మలబుద్ధిసాంద్ర!
పండితకవీంద్ర! భుజగభూపాలచంద్ర! 68

సీ. చిరజీవియనుపేరుఁ జెందినకాకంబు
శాబకస్థితియందుఁ జావకున్నె ?
నీలకంఠాఖ్యచే నెగడెడుపిచ్చుక
పంచలంబడి కష్ట పడుటలేదె ?
శుకసంజ్ఞఁగల్గి వన్నెకునెక్కు కీరంబు
పిల్లినోటికిఁ బేలపిండిగాదె ?
భోగియనంబేరుఁ బొందినయురగంబు
ఛిద్రంబులనుఁజిక్కుఁ జెందకున్నె ?

గీ. నామమాత్రంబుచేతనే భూమిఘనత
గలుగఁబోదల్లు కలిగినఁ గవి కవియగు ;
భోగదేవేంద్ర ! నిర్మలబుద్ధిసాంద్ర !
పండితకవీంద్ర ! భుజగభూపాలచంద్ర ! 69

సీ. ప్రేమమ్మలేని పెండ్లాముఁబెంచుటకన్న
మంచియూటలకోఁతిఁ బెంచుటొప్పు ;
తనయార్తి దుష్టపుత్రున కొసంగుటకన్న
నీచపాత్రంబున వైచుటొప్పు ;
విత్తాధికునిబిల్చి విందుసేయుటకన్నఁ
గడుదరిద్రున కన్నమిడుటయొప్పు ;
ఖలులగుచుట్టాల గౌరవించుటకన్న
శుద్ధునన్యుని ప్రేమఁజూచుటొప్పుఁ ;

గీ. కుజనరాజ సహాయంబుఁ గోరుకొనుట
కన్నరిక్తసజ్జనమైత్రిఁ గాంచుటొప్పు ;
భోగదేవేంద్ర ! నిర్మలబుద్ధిసాంద్ర !
పండితకవీంద్ర ! భుజగభూపాలచంద్ర ! 07

సీ. పటులోహములను సంపెటసాగఁగాఁజేయు
శిలలనుసాగంగఁ జేయునొక్కొ?
నీటినిగతకంబు నిర్మలముగఁజేయుఁ
బవనంబునెటు శుభ్రపరుపఁగలదు?
అనలంబు ననిలంబు ఘనవృద్ధిఁగావించు
జలదంబులనువృద్ధి సలుపఁగలదె?
సున్నంబుగోడకు శోభఁబెంచునుగాని
గడపలకుందేటు నిడఁగఁగలదె?

గీ. మకుటము నృపాలతిలకుని మస్తమునకు
శోభనిడు నిస్వ్వతలకు నశోభనిచ్చు;
భోగదేవేంద్ర! నిర్మలబుద్ధిసాంద్ర!
పండితకవీంద్ర! భుజగభూపాలచంద్ర! 71

సీ. కఠినంపురాల్సైనగలు సేయనోపునే
ధవునిమాటను జవదాటెనేని
రవిఁగ్రుంకకుండంగ దివినిల్పఁజాలునే
పరునందుభక్తి గన్పరుపదేని
సమవర్తివెనువెంటఁ జనఁదానునేర్చునే
విభునెదఁబ్రీతి భావింపదేని
దెసలేకపెరచోట ననువులునిల్పునే
యీశ్వరుమది భజియింపదేని

గీ. ఋషివరులుజాల రమరులునేనిఁజాల
పరయ సాధ్వీమతల్లుల కవనియందు;
భోగదేవేంద్ర! నిర్మలబుద్ధిసాంద్ర!
పండితకవీంద్ర! భుజగభూపాలచంద్ర! 72

సీ. ఇరువురూగినను నుయ్యేలతూగుమింటికిఁ
దూగునేయొక్కరుం డూగునేనిఁ
గాడికి రెండెడ్లఁ గట్టనాగలిసాగు
సాగునే యొకవృషమ్మునఁ గట్ట
నిరువైపులను మోయ నేగునాందోళిక
యేగునేయొకవంక నెత్తిమోయఁ
గరయుగ్మమునఁ గొట్టఁగాఁగదు మ్రోగును
మ్రోగునేయొకహస్త మునను గొట్ట

గీ. సతియుఁబతియును గలియ సంసారమొనఁగు
నెనఁగునే జంటలేకుండ నీదనేని?
భోగదేవేంద్ర! నిర్మలబుద్ధిసాంద్ర!
పండితకవీంద్ర! భుజగభూపాలచంద్ర! 73

సీ. పొదలును గరరుహంబులు ప్రత్యహంబును
గరశాఖ లెట్లు శీఘ్రముగ నెదుగు?
క్షణకాలమున వ్యాధి క్రమముగా ఘనమౌను
గలుగునే శాంతి వేగంబుగాఁగ?
దలవెంట్రుకలు వృద్ధిఁ దనరును దినదినం
బును మస్తకము వేగఁ బొదలఁగలదె?
క్రోధంబుగలుగు నెక్కుడుగాఁగ గడియలో
శాంతంబుగలుగునే సరగమదిని?

గీ. త్వరగఁగలుగును దుర్జనత్వంబుధరణి
సజ్జనత్వంబు చయ్యన సంఘటిలదు;
భోగదేవేంద్ర! నిర్మలబుద్ధిసాంద్ర!
పండితకవీంద్ర! భుజగభూపాలచంద్ర! 74

సీ. కవిలేనిగ్రామంబు రవిలేనివ్యోమంబుఁ
 గడుఁగళాహీనమై కానుపించు
సతిలేని భవనంబుఁ బతిలేని భువనంబుఁ
 గరమశోభనమయి కానుపించుఁ
దిసలేనిగోఱుకును గసిలేనిచెఱుకును
 గడు నయోగ్యంబయి కానుపించు
నసిలేనిబ్రతుకును బసలేని యతుకును
 గరమును లోపమై కానుపించుఁ;
గీ. తెలివిలేని దాపరమును నిలువలేని
కాపురముఁజాల నీచమై కానుపించు
భోగదేవేంద్ర! నిర్మలబుద్ధిసాంద్ర!
పండితకవీంద్ర! భుజగభూపాలచంద్ర! 75

సీ. శలభభక్షణసేయు శారికమదకుంభి
 కుంభస్థమాంసంబుఁ గోరుకొనునె?
బాలగ్రహచికిత్సఁబ్రశ్నఁ జెప్పెడుమాల
 దాసరి రాజవైద్యమున దిగునె
గ్రంథచోరత్వంబుఁ గావించిపరుఁ బొ
 గడువాఁడు సత్కావ్యకర్తయగునె
బక్కఊద్దు వెనుకఁబడియుచ్చుపిట్టలఁ
 గొనువాఁడు వేటకాఁడనఁగదగునె?
గీ. లోకకంటకుఁడగు వాని సాకిజనులఁ
గష్టములముంచు నాతండు ఘనుఁడుగాడు;
భోగదేవేంద్ర! నిర్మలబుద్ధిసాంద్ర!
పండితకవీంద్ర! భుజగభూపాలచంద్ర! 76

సీ. వ్యాధిశమింపఁ జేయఁగలేని మందేల?
కష్టంబునకుఁగాని కాంతయేల?
తలిదండ్రులకు సేవఁ జలుపనిసుతుఁడేల?
మేలుఁగోరనియట్టి మిత్రుఁడేల?
బరువులాగని బలీవర్దమ్ములవియేల?
పాలీకతన్నెడు పశువులేల?
యుడుముఁగన్గొని భయంపడు జాగిలంబేల?
యాకలిదీర్చని యన్నమేల?

గీ. వానగురియని యవ్వారివాహ మేల?
బలములేకున్న యుద్ధకౌశలము లేల?
భోగదేవేంద్ర! నిర్మలబుద్ధిసాంద్ర!
పండితకవీంద్ర! భుజగభూపాలచంద్ర! 77

సీ. మతిలేనిజనయిత్రి సుతుని తిండిఁదలంప
దాబిడక్రోపన యనఁగఁదగునె?
ధనహీనుఁడే దేని దైవంపుబనికీమి
నాతండుపాతకి యనఁగఁదగునె?
ఈనినప్పుడుపులి కూనలఁదినుఁగాన
కదక్రూరచిత్త రాలనఁగఁదగునె?
మక్కిలేకున్న విత్తులమొల్వనీ దిల
నదిమహానిస్సార మనఁగఁదగునె?

గీ. తెలివిలేనట్టివాఁడు వాదించుమిగుల
నదిమహాగౌరవంబని యనఁగఁదగునె?
భోగదేవేంద్ర! నిర్మలబుద్ధిసాంద్ర!
పండితకవీంద్ర! భుజగభూపాలచంద్ర! 78

సీ. మీసములకు మసిబూసిన యౌవన
స్థిరవిలాసంబును జెందఁగలఁడె ?
కడుఁగ్రుడ్డికంటికి గాటుకన్నిడినంత
దృష్టిభాగ్యమును వహింపఁగలఁడె
బొక్కినోటికిదంతపుంబండ్లఁ దగిలింప
దశనసత్త్వస్థితిఁ దాల్పఁగలఁడె ?
మొండిచేతులకుఁ గుబుసముఁదొడినయంతఁ
గర్తృత్వసంపదఁ గాంచఁగలఁడె ?

గీ. తప్పఁదప్పించుకొన నసత్యంబువలుక
నరుఁడువొందునె సత్యసంధత్వమవని;
భోగదేవేంద్ర ! నిర్మలబుద్ధిసాంద్ర !
పండితకవీంద్ర ! భుజగభూపాలచంద్ర ! 79

సీ. ఏనుఁగెక్కినమావటీనికి ఘనమేమి ?
కూడఁబెట్టినవేశ్య గొప్పయేమి ?
బరువుమోయునదైన ఖరముగౌరవమేమి ?
ద్విజతగల్గినఁబండ్ల విలువయేమి?
కంకణంబులఁగూడ గాజులపరువేమి ?
యంతిపురపుదోమ యధికమేమి?
జలరాశినత్తగుల్లల గురుత్వంబేమి ?
ఫలములదినుపుర్వు ప్రతిభయేమి ?

గీ. ఫలతరువుజేరు గుడ్లగూబయుట వేమి ?
కవితనేర్చిన యరసికు గరిమయేమి ?
భోగదేవేంద్ర ! నిర్మలబుద్ధిసాంద్ర !
పండితకవీంద్ర ! భుజగభూపాలచంద్ర ! 80

సీ. చెరువుకట్టకుఁ గ్రిందఁ బురమును, వెంగలి
మనుజేశు చెంత నమాత్యపదవి,
తలక్రిందద్రవ్యంబుఁ, దరువుక్రిందఁదపంబు
దైవజ్ఞునొద్ద ఛాత్రప్రసక్తి,
కత్తిపైనృత్యంబుఁ, గవితోడ వాదంబు
ఘనదూరదేశ నౌకావిహార,
మతిబలవంతు స్నేహము, కుహౌషధసేవ,
కూరిరునితోడ విరోధవృత్తి,

గీ. ధనికసౌధంబు క్రిందఁ బేదయిలునున్న
నొక్కటటిసెగ్గు, లగ్గునొక్కటటిని, ;
భోగదేవేంద్ర ! నిర్మల బుద్ధిసాంద్ర !
పండితకవీంద్ర ! భుజగభూపాలచంద్ర ! 81

సీ. ఒకనినెక్కించుఁ దానున్నతస్థలమున
కెక్కఁగనిచ్చున యెట్లు నేర్చు ?
గుండుదూఱముబాఱఁ గొట్టుఁ, దానేగంగ
నింతయేనిఁ దుపాకియెట్లునేర్చు ?
తనమీఁది పొగబండి దవ్వుగాదొంలించు
నిలదాను దొర్లనే యినుపకమ్మి ?
దారముచేత వస్త్రంబంటఁ బట్టించు
నట్లుబట్టఁగ సూది యెట్లునేర్చు ?

గీ. పూని పరులకు నీతులు మానవుండు
తెలుపుఁదాసీతి పథమునఁ దిరుగఁగలఁడె !
భోగదేవేంద్ర ! నిర్మలబుద్ధిసాంద్ర !
పండితకవీంద్ర ! భుజగభూపాలచంద్ర ! 82

సీ. తడిసిపవంకరమైనఁ జెడునే నులకకుక్కి ?
చేరిజోకొట్టిన నూరుకోనునె ?
మక్కళించినపొట్ట ముక్కలై పోవునే ?
చీదిన ముక్కూడి చేతఁబడునె?
గాడిదమెసలిన గరికనాశనమౌనె ?
మసిఁబ్రామి నంతనపసిఁడి చెడునె ?
వేచినపప్పులు వెగటుగానేర్చునే ?
రాచినరతనంబు రవళిచెడునె ?

గీ. దూదిగూరినబుంగ తేత్తునియలగునె ?
పండితుండాపద ఘుల్లు భయముఁగనునె !
భోగదేవేంద్ర ! నిర్మలబుద్ధిసాంద్ర !
పండితకవీంద్ర ! భుజగభూపాలచంద్ర ! 83

సీ. కూఁతుగుల్లలనమ్మి కుడువనేర్చిన యతం
డల్లుని విందున కాత్రపడునె ?
మగని కంచంబమ్మి మట్టెలఁగొనునది
మఱఁదతోవేడుచెంబు కొఱకుఁగనునె ?
తల్లికన్నమిడక తిరిమెడునాతండు
తోఁబుట్టు సాకై త్రొట్రుపడునె ?
చెల్లెండ్రఁగని చిరచిరలాడు నయ్యది
యూడుబిడ్డలపొత్తు కాసపడునె ?

గీ. తమ్ములకుఁ జేతబడిసేయఁ దలఁచువాఁడు
పొరుగువానికిఁ జేయంగ వెరచువాఁడె ?
భోగదేవేంద్ర ! నిర్మలబుద్ధిసాంద్ర !
పండితకవీంద్ర ! భుజగభూపాలచంద్ర! 84

సీ. మృదులతికామతల్లిక కంపపైఁబ్రాఁకు
సాలంబునను బ్రాఁకఁ జాలునొక్కొ?
మలయమారుతము తీవలఁగదల్చునుగాని
భూజంబులఁ గదల్పఁ గలుగునొక్కొ?
లలితసరోవీచి జలజపత్త్రమ్ముల
నూఁచు నేనుఁగుల నూఁపునొక్కొ?
పంటకాలువగడ్డి పరకఁ దేల్చునుగాని
యోడను దేల్పంగ నోపునొక్కొ?

గీ. పేదవాఁడు మహోదధి నీదనేర్చు
నెట్లు సంసారవారిధి నీదనేర్చు?
భోగదేవేంద్ర! నిర్మలబుద్ధిసాంద్ర!
పండితకవీంద్ర! భుజగభూపాలచంద్ర! 85

సీ. కన్నములపడిపూటుగా నీటమునిఁగిన
పడవ క్రమంబుగా నడచునేని!
మంగలంబునమలమలమాడిమసియైన
యట్టిగింజలు మొక్కలయ్యెనేని!
చిల్లులువడి శ్రుతిచెడినమృదంగంబు
బాగుగాధ్వనిగల్గి మ్రోఁగునేని?
పక్షముల్విరిగి భూపతనమైనశకుంత
ముడ్డీనగతిని బోనోపునేని?

గీ. దుర్జనుఁడు నైజగుణములఁ ద్రోసిపుచ్చి
సద్గుణంబులసఖము నెసంగఁగలఁడు;
భోగదేవేంద్ర! నిర్మలబుద్ధిసాంద్ర!
పండితకవీంద్ర! భుజగభూపాలచంద్ర! 86

సీ. వర్గఅబంధుత్వ ధర్మంబుసర్వంబుఁ
జేరినశుభలేఖచేతఁ దెలియు
నర్ధాంగియిల్లాలటన్న మంతెల్లఁ జే
సినయుపచారంబుచేతఁ దెలియు
శిష్యవాత్సల్యవిశేషంబు సకలంబుఁ
జెప్పినయవ్విద్యచేతఁ దెలియు
భక్తరక్షకతా ప్రభావమంతయును బో
షించిన యాగొప్పచేతఁ దెలియుఁ

గీ. పుత్రునిపైఁగలప్రేమ సంపూర్ణముగను
సిరిని కూర్చెడు నప్పనిచేతఁ దెలియు ;
భోగదేవేంద్ర ! నిర్మలబుద్ధిసాంద్ర !
పండితకవీంద్ర ! భుజగభూపాలచంద్ర ! 87

సీ. అప్పుఁజేసినవాని జప్పరించునువడ్డి ;
ప్రాణిహింసకుని బాపంబుదినును ;
గణికావిహారి రోగంబులు భక్షించుఁ ;
గమ్మరిబొగ్గులు గరముమెక్కుఁ ;
గావ్యకర్తను మ్రింగు గ్రంథవిక్రేత, వి
క్రయకర్తముద్రణాలయము మెసవు ;
వ్యాపారపరుఁ బరుపతి యెక్కుడుగబొక్కు
వానయెద్దడి కృషీవలుభుజించు,

గీ. గురుబసాపకు బోధనాగరిమ, రాజ
చంద్రుసాపమునతని దర్జావిధంబు ;
భోగదేవేంద్ర ! నిర్మలబుద్ధిసాంద్ర ?
పండితకవీంద్ర ! భుజగభూపాలచంద్ర ! 88

సీ. ఘాసంబుచేనిల్లుఁ గట్టవచ్చునుగాని
దడిగట్టుకొనిన భద్రంబుఁగనునె!
కత్తిచేఁగనుబొమ్మ నొత్తవచ్చునుగాని
కనుగ్రుడ్డు నొత్తసౌఖ్యంబుఁగనునె?
నీటిచేడొక్కలు నింపవచ్చునుగాని
ముక్కులునింపంగ ముదముఁగనునె?
పిడకలచేనగ్నిఁ బెంపవచ్చునుగాని
ప్రాయినిబెంచినయెడ నయముగనునె?

గీ. వడ్డిచేద్రవ్యమును బెంచవచ్చుఁగాని
యప్పులనుబెంచ నాతండు మెప్పుఁగనునె?
భోగదేవేంద్ర! నిర్మలబుద్ధిసాంద్ర!
పండితకవీంద్ర! భుజగభూపాలచంద్ర! 89

సీ. ఆమయపీడితుఁ డంత్యవేదనఁజూచి
తాభూతవేదనఁ దగులువెజ్జు
మూగినచుట్టాల ముఖవైఖరినిగాంచి
కడసారిచూపని యడలురోఁగి
శవజాగరణమును సల్పుచుమదిలోనఁ
దనయంత్యవిషయంబుఁ దలఁచునరుఁడు
తనకాంత ప్రసవవేదనఁ గాంచితాను ని
స్సంగవృత్తి దృఢంబుసలుపు భర్త

గీ. ఆత్మపండితుఁ డపకీర్తి నందెనేని
దనయగౌరవముగ నాత్మఁదలఁచు రాజు;
భోగదేవేంద్ర! నిర్మలబుద్ధిసాంద్ర!
పండితకవీంద్ర! భుజగభూపాలచంద్ర! 90

సీ. పడయుమజూరియు బంగారుతరుగుఁ దు
 ల్యమయేనినతఁడు పెద్దమ్మబిడ్డ
వాగినవాగుడుఁ బడినట్టితిట్లుఁ దు
 ల్యమయేని నతఁడు పిళ్ళారికొడుకు
చేసెడుచేఁతవచ్చెడు నపకీర్తి తు
 ల్యమయేని నతఁడు గులాముబిడ్డ
చేసినసుకృతంబుఁ జెందినయఘముఁ దు
 ల్యమయేని నతఁడు పోతన్నకొడుకు

గీ. చదువుమరపును దుల్యమై పొదలెనేని
నాతఁడిలలోనఁ గా రెనుబోఁతుబిడ్డ;
భోగదేవేంద్ర! నిర్మలబుద్ధిసాంద్ర!
పండితకవీంద్ర! భుజగభూపాలచంద్ర! 91

సీ. సుకవికావ్యముఁగన్నఁ గుకవిపొత్తముఁగన్నఁ
 గుకవినిందయెముందు ప్రకటమగును;
సుజనునాకృతిఁగన్న గుజనురూపముఁగన్నఁ
 గుజనుడంబమెముందు గొప్పయగును;
దాతయీగిఁగన లుబ్ధ త్యాగమునుగన్న
 లుబ్ధుద్రవ్యమెముందు లోలమగును;
సాధ్వీశీలముఁగన్న సానిగుణముఁగన్న
 సానియాడ్చతిముందు శస్తమగును;

గీ. దధిఁదరచిరేని నాజ్యముత్పన్నమగును
బ్రభవమగు నుత్తమగుణంబు వసుధనల్లె;
భోగదేవేంద్ర! నిర్మల బుద్ధిసాంద్ర!
పండితకవీంద్ర? భుజగభూపాలచంద్ర! 92

సీ. పలువురిలోనీతి పరుసిదూరుటకంటెఁ
జాబునఁ దలఁగొట్టి చంపుటింపు;
దుర్జనసాంగత్య మార్జించు పనికంటె
మృగసంచయములఁ దిరిగినఁ దగును;
అరయ నన్ను ద్వేషి నైనవాపికివిందు
సేఁతకంటెను నిప్ఱు సెప్పటొప్పు;
దయలేని ప్రభువునాశ్రయముకంటె బజారుఁ
బడిన బిచ్చాంగ శ్రవణముగుణము;

గీ. ఉన్నదొరునకు తనకు లేదన్నయేడ్పు
కంటెఁ జేఁజాచి యాచింపఁగఁరమువరము;
భోగదేవేంద్ర ! నిర్మలబుద్ధిసాంద్ర !
పండితకవీంద్ర ! భుజగభూపాలచంద్ర ? 93

సీ. ఇడెద రమ్మనుచుఁ ద్రిప్పెడు దాతకన్న లే
దని పల్కులోభి యత్యంత ఘనుఁడు;
బంధుల విందులోఁ బంక్తిభేదముఁ గన్న
యతనికన్నంబోని యతఁడు మేటి;
పండితుండై సభఁ బరిహాసమును జెందు
వాని కన్నను మూఢ పశువుమేలు;
లక్షాధికారియై దక్షత లేకున్న
యతనికన్న దరిద్రుఁ డత్యధికుఁడు;

గీ. సర్వసంపత్తులుం గల్గిసంతులేని
వానికన్నఁగడుఁ గుచేలుఁడైన బాగు;
భోగదేవేంద్ర ! నిర్మల బుద్ధిసాంద్ర ?
పండిత కవీంద్ర ! భుజగభూపాలచంద్ర ! 94

సీ. గురివెంద మెరుపును గోరి గోరంట త
　　　　పస్సులుఁజేసినఁ బడయఁగలదె ?
చందనసౌరభ సంపత్తిఁగోరి మా
　　　　రెడు వ్రతంబులుసేయఁ బడయఁగలదె ?
మాద్వీఫలరసోపమఁగనంగఁగోరి మా
　　　　మిడి దానములుసేయఁ బడయఁగలదె?
కస్తూరిగుణమును గాంచంగఁగోరి యిం
　　　　గువ యాత్రలొనరించి గొనఁగఁగలదె ?
గీ. పండితుని సత్ప్రతిభఁగోరి పామరుఁడు స
భాస్థలంబులఁదిరిగిన బడయఁగలఁడె !
భోగదేవేంద్ర ! నిర్మలబుద్ధిసాంద్ర !
పండితకవీంద్ర ! భుజగభూపాలచంద్ర ! 　　95

సీ. పదుగురచేనైనఁ గదులనిపాగబండి
　　　　బాలుచే యంత్రరూపమునఁ దిరుగు;
నక్షౌహిణీసేనకైన లొంగనిరాజు
　　　　సన్ముని శాపవశత నడంగు
లోకంబులెల్లఁ బెల్లుగ్రమింగు యముఁడొక
　　　　సాధ్వి పాతివ్రత్యశక్తిఁజిక్కు;
నినసహస్రాంశుల నింకనిశరనిధి
　　　　యొక్కని శరమునను క్కడంగు;
గీ. గుణమె ధాత్రీతలంబున గణనకెక్కు
గణమువలనను లాభంబుగలుగఁబోదు;
భోగదేవేంద్ర ! నిర్మలబుద్ధిసాంద్ర !
పండితకవీంద్ర ! భుజగభూపాలచంద్ర ! 　　96

సీ. అతిసారరోగి యన్నాతురుండగునేని
జ్వరపీడితుఁడు నిద్రఁబండునేని
వాతరోగిపరుగు వారఁగలుగునేని
హృద్రోగికస్తి భరించునేని
కనుతెవుల్గొంటు దివ్వెను గాంచఁగలఁడేని
చలితశీర్షుఁడు వాదుసలుపునేని
సంధించినతఁడు పాసంగికుండగునేని
మాటబోయినవాఁడు మానియేని

గీ. నవనిపడమంత్రపు సిరి వాఁడగునుగాదె
పుట్టువుననుండి సిరిగల పూరుషుండు;
భోగదేవేంద్ర! నిర్మల బుద్ధిసాంద్ర!
పండితకవీంద్ర! భుజగభూపాలచంద్ర! 97

సీ. ములకళ్ళమ్మల కుమ్మెలలువైచి యూగు వాఁ
డనలంబుఁ గొంగున నణఁచువాఁడు
కత్తివాదరనాకఁ గానెంచువాఁడును
దివ్వెముద్దిడుటకు దివురువాఁడు
కోతిచెంతఁ దపంబుఁ గోరిచేసెడువాఁడు
కూళఁబెత్తనమున గూర్చువాఁడు
కాలిక్రిందిలతను ఖండించుకొనువాఁడు
ఖలునితో స్నేహంబు సలుపువాఁడు

గీ. ఘనునితోడ విరోధంబుఁ గొనెడువాఁడు
నిట్టివాఁడని చెప్పంగ నేరికగును;
భోగదేవేంద్ర! నిర్మలబుద్ధిసాంద్ర!
పండితకవీంద్ర! భుజగభూపాలచంద్ర! 98

సీ. తనకుత్కిఁ గాలినఁ దల్లడిల్లునతండు
పరులయాఁకలిబాధ నెఱుఁగరాదె?
తనదరిద్రతకు ఖేదంబందవలయుఁగా
కితరులనిందింప నేమిఫలము!
తనయసమర్థతఁ దలఁచి పొక్కునతండు
పరులసంగతి మతినరయరాదె?
తనభాగ్యమునకు సంతసపడవలయుఁగా
కితరులఁ దూషింప నేమిఫలము?

గీ. తనదుఃజన్మంబుఁగూర్చి మోహపడవలయుఁ
గాకయన్యులఁ దిట్టినఁగలదెకీర్తి?
భోగదేవేంద్ర! నిర్మలబుద్ధిసాంద్ర!
పండితకవీంద్ర! భుజగభూపాలచంద్ర! 99

సీ. సన్నాయిపలుకుఁ బ్రశస్తంబు సేయుంగఁ
గారణంబయినది కలపదంటు;
మద్దెలవాద్యంబు మన్ననగావింప
మేటికారణమగు మీఁటుదెబ్బ;
యభినయంబును ఖ్యాతిసందు నట్లొనరింప
హేతువైనది మర్ధమెఱుఁగుశక్తి
లాస్యంబు మిగుల విలాసంబునుం గూర్ప
గట్టిహేతువు గజ్జగట్టునేర్పు

గీ. యోగ్యపాలన రాజు సేయుటకు ధాత్రిఁ
గారణము నిల్పుకొనునట్టి గౌరవంబె;
భోగదేవేంద్ర! నిర్మలబుద్ధిసాంద్ర!
పండితకవీంద్ర! భుజగభూపాలచంద్ర! 100

సీ. పల్లేరుకాయల పఱుపైన సౌఖ్యమా
నాఁడికల్ దెచ్చెడి యాలికన్నఁ
దేళ్లకుళ్లాయి నెత్తినిబెట్ట క్షేమమా
తగవులుదెచ్చు నాత్మజునికన్న
దురదగొండిలిమేను దోమినఁ శ్రేయమా
నెగ్గుఁదలంచు స్నేహితునికన్న
సింగంపుఁగుహను వసించిన భద్రమా
హితవుఁ దప్పినచెలి యింటికన్న

గీ. నడవి మృగముల పొత్తు మేలవును గష్ట
జాలముల పాలొనర్చు చుట్టాలకన్న;
భోగదేవేంద్ర ! నిర్మలబుద్ధిసాంద్ర !
పండితకవీంద్ర ! భుజగభూపాలచంద్ర ! 101

సీ. మొదలువాసనఁజూచి తుదిఁగొమ్మ ఫలమును
జరచరఁగను చాకచక్యమొకటి
పూని వ్రేల్పట్టిన బుఱ్ఱపోయిన నోరుఁ
దెరువని బింకంపుఁ దీండ్రయొకటి
గడిఁదప్పకుండ సంఘముఁగూడి శక్తిని
మించిన పనులఁ గావించుటొకటి.
పోఁదరిమినఁగజు మీఁది మీఁదికి వెంటఁ
బాఱికఁజొచ్చెడునట్టి వీకయొకటి

గీ. చీమకడనేర్చుకొనిబంటు, సామిచెంత
సేవఁగావించి కీర్తిఁ జెందవలయు;
భోగదేవేంద్ర ! నిర్మల బుద్ధిసాంద్ర !
పండితకవీంద్ర ! భుజగభూపాలచంద్ర ! 102

సీ. రోటను దలవెట్టి రోకలిపోటున
కార్తిని గనని ధైర్యంబొకండు
తలవెంట్రుకను బర్వతమునకు ముడివైచి
లాగెడు బుద్ధి బలంబొకండు
మేడనెక్కిన మొండిగోడనెక్కిన నేక
గౌరవముగ నెంచు తీరొకండు
ఇనుని ప్రతాపంబు దనప్రతాపంబుగా
లక్ష్యమందుంచి మెలఁగుటొకండు

గీ. అబ్బెస మొనర్చి సతము రాజాధిరాజ
సవిధమున సంచరింపంగఁ జను సచివుఁడు ;
భోగదేవేంద్ర ! నిర్మలబుద్ధిసాంద్ర !
పండితకవీంద్ర ? భుజగభూపాలచంద్ర ! 103

సీ. తననోరిమాట శాసనముద్రయై యొప్ప
వ్యవహారములు చక్కఁ బడుటయొకండు,
తనయేలుఁబడినేల ధర్మసంస్థాపన
ఘనసభారంగమై గ్రాలుటొండు,
తనపెట్టుపోతల తావులు రాజసూ
యాధ్వరశాలలై యలరుటొండు,
తనదుష్టశిక్షా విధానక్రమంబెల్ల
శమనపద్ధతియై యొసంగుటొండు,

గీ. రాజధర్మంబులై ధాత్రిఁ దేజరిల్లుఁ
గాని వేఱొండునడవడిఁ గాదు లేఁడు ;
భోగదేవేంద్ర ! నిర్మలబుద్ధిసాంద్ర !
పండితకవీంద్ర ! భుజగభూపాలచంద్ర ! 104

సీ. తప్పినవాగొడ్డుఁ దప్పమిఁగడలి యొ
డ్డేగాక యిఁకనన్యమేమికలదు ?
కుదిరిన బహుమతి కుదురమిమందు క
ర్చేగాక యిఁకనన్య మేమికలదు ?
సాగినబండియు సాగకుండిన మొండి
యేగాక యిఁకనన్యమేమికలదు ?
జరిగిన సౌఖ్యంబు జరుగకుండిదుఃఖ
మేగాక యిఁకనన్యమేమికలదు ?

గీ. ద్వంద్వములగెల్చి యీషణత్రయమువిడిచి
యున్నయాతఁడె ధాత్రి నత్యుత్తముండు ;
భోగదేవేంద్ర ! నిర్మలబుద్ధిసాంద్ర !
పండితకవీంద్ర ! భుజగభూపాలచంద్ర ! 105

సీ. చింతింపనేల సంసృతిభరమ్మననాకుఁ
బ్రజఁబెక్కురం గన్న ప్రభువుగలుగఁ ?
గవిదరిద్రతకు దుఃఖంబందనాకేల
రాజకవీంద్ర గౌరవముగలుగ
నన్యుని జేఁజాచి యాచింపనాకేల
వితరణఖనిభూమి విభుఁడుగలుగ
నాకేల క్షామజరాకష్టసంతాప
మార్యావనజనాయకుఁడుగలుగ

గీ. ననిమనమ్మునఁ దలపోసి యహరహమ్మ
నీదునాశ్రయమునుగోరి మోదపడుదు;
భోగదేవేంద్ర ! నిర్మలబుద్ధిసాంద్ర !
పండితకవీంద్ర ! భుజగభూపాలచంద్ర ! 106

సీ. ఘంటారుతిశ్రుతి గ్రాలుసరస్వతీ
గానంబు నీసభాంగణమునందు;
ఓంకారనాద సముజ్జ్వలంబై యొప్పు
నీదేవతార్చనా నిలయమందు!
గంధేభతురగ ఘీంకారహేషాధ్వని
జానగు నీమొగసాలయందు!
రథశిబికాదిక రమ్యారావంబెల్ల
విలసిల్లు నీపురవీధులందు!
గీ. రక్షివర్గ ప్రతీహారరవమఖిలము
పరగునీదు సింగంపు దువారమందు;!
భోగదేవేంద్ర! నిర్మలబుద్ధిసాంద్ర!
పండితకవీంద్ర? భుజగభూపాలచంద్ర! 107

సీ. కౌండిన్యగోత్ర సంకలితుఁడాపస్తంబ
సూత్రుఁడా నరసింహసూరికిం బ్ర
పౌత్రుండ, వెంకనపండిత పౌత్రుండ,
రామనార్య మనీషిరత్నసుతుఁడ;
దైవగురుప్రసాద జనితసంస్కృతాం
ధ్రసరస్వతీ రాజితప్రయశుఁడ;
బహువిధనవ్య ప్రబంధనిబంధన
బంధురహృత్ప్రతిభా యుతుండ
గీ. ఖ్యాతమగు గ్రొత్తపల్లి సదన్వవాయ
సంభవుఁడను సుందరరామ సంజ్ఞవాఁడ;
భోగదేవేంద్ర! నిర్మలబుద్ధిసాంద్ర!
పండితకవీంద్ర! భుజగభూపాలచంద్ర! 108

శ్రీ భుజగభూపాల శతకము సంపూర్ణము.

చ. మతికుశలత్వ మేర్పడఁ దమ
మాతల సమ్మతముల్ సదంశముల్
రతనములట్లుకూర్చి కవి
రాజభుజంగ పతిన్సువర్ణ సం
గత పృథురత్నహార శత
కద్యుతిరాజితుఁ జేసినట్టి నీ
చతురత మెచ్చవచ్చు నయ
సంయుత, సుందర రామ సత్కవీ !

ఇట్లు,

ఆశుకవిచక్రవర్తి, ఆశుకవిశిఖామణి
అవధాని పంచానన, ప్రౌఢభారతీత్యాది
బిరుదాంకితులు, కొప్పరపు సోదరకవులు;
శతావధానులు, కొప్పరము.